# ఆంధ్ర రచయిత్రుల సమాచార సూచిక

కూర్పు:

కె. రామలక్ష్మి



# ఆంధ్ర రచయిత్రుల

# సమాచార సూచిక

కూర్పు

కె. రామలక్ష్మి




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి

కళాభవన్

హైదరాబాదు-4.

1968

రూ. 2-50

# కృష్ణజ్యోతి శర్మ పి.

భర్త శ్రీ పి. జె. శర్మ. జన్మదినం 16-9-38. జన్మస్థలం రంగసముద్రం. చిత్తూరు జిల్లా. చదువు సంధ్యలు సామాన్యం. 1956 నుంచీ రచనలు సాగిస్తున్నారు. శరత్, విశ్వనాథ, బాపిరాజు, శ్రీ శ్రీ మొదలైనవారి రచనలని అభిమానిస్తారు.

మధురస్వప్నం, ప్రణయం తెచ్చిన ప్రళయం, అనురాగం, విషకీటకం మొదలైన నవలలు ప్రచురించారు.

రచయిత్రి కళాకారిణికూడా. ఉత్తమ గ్రంథపఠనం, ఉత్తమ నాటకాలు చూడడం సరదాలు.

చిరునామా :

7, కృష్ణరావునాయుడు వీధి,
మద్రాసు-18.

# కౌసల్యాదేవి కోడూరి (ఆరెకపూడి)

భర్తగారు శ్రీ ఆరెకపూడి రామశాస్త్రి. జన్మదినం తెలియదు. జన్మస్థలం రాజమండ్రి.

చక్రభ్రమణం, శాంతినికేతన్, శంఖుతీర్థం, ధర్మచక్రం, ప్రేమనగర్, కళ్యాణమందిర్, చక్రనేమి మొదలైన అనేక నవలలు, కథానికలు, వ్యాసాలు ప్రచురించారు.

వీరి చక్రభ్రమణం నవల బహుమతి పొందింది. చలన చిత్రంగా రూపొంది బహుజనాదరణ పొందింది.

చిరునామా :
6-18-1 ఇన్నీసుపేట,
రాజమండ్రి-2.

# మనవి



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారూ, అకాడమీవారి ఆంధ్ర రచయిత్రుల సలహా సంఘమూ ఆంధ్రరచయిత్రుల సూచిక ఒకటి తయారుచేస్తే బాగుంటుందని సూచించినప్పుడు, వారు ఆ సూచనను అంగీకరించారు. ఫలితంగా ఆ సమాచార సూచికను తయారుచేసే బాధ్యత నాకే పెట్టారు. గత సంవత్సరంనుండి యీపని చేయడం ప్రారంభించాను.

ఈ సూచికను రూపొందించే యత్నంలో చాలామందికి లేఖలు వ్రాశాను. ప్రశ్నావళి పంపాను. కాని బహు కొద్దిమంది మటుకే సమాధానాలు పంపారు.

వరంగల్లులో జరుగుతున్న రచయిత్రుల తృతీయ సభలలో ఈ పుస్తకాన్ని ఆవిష్కరిస్తే బాగుంటుందన్న దృష్టితో 1967 డిశంబరు ఆఖరుదాక వచ్చిన వానిని క్రోడీకరించి ఆయా రచయిత్రుల జీవిత విశేషాలు, ఛాయాచిత్రాలు ఉన్న యీ చిన్ని సూచికాగ్రంథాన్ని తయారుచేశాను. రచయిత్రుల వివరాలు, పేర్లు అకారాదిగా ఇవ్వడం జరిగింది.

ప్రచురణలో, కూర్పులో పలువిధాల సహాయంచేసిన ఎం. ఎస్. రావుగారికి, ఆరుద్రగారికి, బాపుగారికి నా కృతజ్ఞతలు. సూచికను పరిశీలించి సలహానిచ్చిన నాయని కృష్ణకుమారికి, సరస్వతీదేవిగారికి ఋణపడి ఉన్నాను.



## కమల మిట్టగుంట

తండ్రిగారు శ్రీ మిట్టగుంట సుబ్బారాయుడుగారు. జన్మదినం 7-4-'22. జన్మస్థలం మద్రాసు. స్కూలు ఫైనలు ప్యాసయారు. 1940 నుంచీ రచన సాగిస్తున్నారు. కనుపర్తి వరలక్ష్మమ్మ, ద్వివేదుల విశాలాక్షి, ముప్పాళ్ వారి రచనలు అభిమానిస్తారు.

చిరుకథలు పది, తమిళంలో కొన్ని వందల కథలు 14 నవలలు, ప్రయాణ వ్యాసాలు, కవితలు ప్రచురించారు. అడవి బాపిరాజుగారి 'నారాయణ రావు' తమిళంలోకి అనువదించారు.

సంఘసేవ, తమిళ రచయితల సంఘం, నర్సరీస్కూలు సరదాలు.

చిరునామా :

63, నాగప్పయ్యర్ వీధి,
తిరువళిక్కేణి,
మద్రాసు-5.

ఈ సూచికలోని మంచి అంతా సహృదయుల సూచనాఫలితంగానూ ఏమైనా లోట్లు ఉంటే అవి నా లోపాలుగానూ భావించి పాఠకులు ఈ ఆంధ్ర రచయిత్రుల సమాచార సూచికాగ్రంథాన్ని అభిమానిస్తారని ఆశిస్తాను.

ఇలాగే ఇంకా వివరాలు సేకరించి వీలైనంతత్వరలోనే ఇంకొక సమగ్ర సూచికను తయారుచేసే కృషి సాగిస్తాను. దానికీ రచయిత్రులు ఇప్పటివలెనే సహకరిస్తారని ఆశిస్తాను.

ఈ అవకాశాన్ని నాకిచ్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికీ, కార్యదర్శి శ్రీ రామానుజరావుగారికీ నా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. అందంగా అచ్చువేసిన భావనారాయణగారికీ, చేదోడు వాదోడుగా పనిచేసిన రంగాచారి గారికి నమస్కారాలు.

మద్రాసు,
31-1-'68

కె. రామలక్ష్మి



## అచ్యుతవల్లి ఐ. వి. ఎస్.

భర్తగారు శ్రీ ఐ. రాఘవాచార్య. జన్మదినం 1-5-'43. జన్మస్థలం కాకినాడ. ప్రయివేటుగా హిందీ, ఆంగ్ల, సంస్కృత భాషలు అభ్యసించారు. 1957 నుంచీ వ్రాస్తున్నారు. బుచ్చిబాబు, మాలతీచందూర్ అభిమాన రచయితలు.

బాత్ ఏక్ రాత్ కీ, మూగపోయిన ప్రకృతి, అవ్యక్తాలు మన స్తత్వాలు, పుట్టిల్లు మొదలైన కథా సంకలనాలు ప్రచురించారు. 'మూడుముళ్లు' నవల రచించారు.

చిత్రలేఖనం, లలిత సంగీతం, పర్యటనం ఫొటోగ్రఫీ సరదాలు.

చిరునామా :

C/o ఐ. రాఘవాచార్య,
సెంట్రల్ ఎక్సైస్,
న్యూ కాలనీ, శ్రీ కాకుళం.



## కమలాదేవి బుర్రా

భర్తగారు కీ.శే. బుర్రా బదరీనారాయణమూర్తిగారు. జన్మదినం 13-4-1908. జన్మస్థలం విశాఖ. ప్రాచీనాంధ్ర, ఆంగ్ల సాహిత్యాలతో పరిచయం ఉంది. చాలాకాలంనుండీ వ్రాస్తున్నారు.

శ్రీ వైశాఖ వేంకట ప్రభూదయం, ఛందోహంసి రెండు భాగాలు, అనుష్టుప్పు, నిగమాంతర కవితోపమలు, మందాక్రాంత కవితాస్రవంతి అనే పలు గ్రంథాలు ప్రచురించారు. ఛందోహంసి పోస్టు గ్రాడ్యుయేటువారికి, భాషా ప్రవీణవారికి పాఠ్య గ్రంథంగా నియమింప బడింది.

ఆంధ్రా సెనేటు సభ్యులుగా, అనేక ప్రముఖ సంస్థలలో, క్రమాలలో-పాల్గొన్నారు.

చిరునామా :

శ్రీనివాస్,

మహారాణీపేట, విశాఖపట్నం-2.



# ఆనందరామం సి.

భర్తగారు శ్రీ సి. రామాచారి. జన్మదినం 20-8-'35. జన్మస్థలం ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా. తెలుగులో ఎం.ఏ. పట్టభద్రులు. చిన్నతనంనుంచీ రచన సాగించినా మధ్యలో ఆగి తిరిగి ప్రారంభించారు 1964 లో. అందరి రచనలూ చదవడము, వారి విలక్షణతలు గ్రహించడమే అభిమానిస్తారు.

సంపెంగపొదలు, స్వాతిజల్లు, జాహ్నవీ హైమవతులు, సాగరసంగమం, తీరని వెతలే తీయనిగాథలు, ఆత్మబలి మొదలైన నవలలు ప్రచురించారు.

తోటపని, పుస్తకాలు చదవడం సరదాలు.

చిరునామా :

C/o. సి. రామాచారి,

లైన్ 4, 550-బి.,

బి. హెచ్. ఇ. లిమిటెడ్ టౌన్‌షిప్, హైదరాబాదు-32.



## కోమలాదేవి బి.

భర్త శ్రీ బి. రత్నకుమార్. జన్మదినం 23-8-'35. జన్మస్థలం ఆదోని, కర్నూలు జిల్లా. బి.ఏ., బి.ఇడి. పట్టభద్రులు. 1957 నుండీ రచన సాగిస్తున్నారు. ఎ. జె. క్రానిన్ నవలలు, విశ్వనాథవారి రచనలు, రంగనాయకమ్మగారి రచనలు అభిమానిస్తారు.

బంగారుపంజరం, ఆరాధన, పునస్సమాగమం మొదలైన నవలలు ప్రచురించారు. బంగారుపంజరం నవల బహుమతి నందుకుంది.

పుస్తకపఠనం, టూరింగు, ఆంగ్ల హాస్యరచనల పఠనం కుట్టుపని, తోటపని సరదాలు.

చిరునామా :

C/o. సరళా నాగభూషణం,

ఎస్. ఎమ్. గరల్స్ హై స్కూలు,

బాపట్ల, గుంటూరు జిల్లా.



ఇందుమతీదేవి
గుడిపూడి

భర్త కీ. శే. శ్రీ గుడిపూడి రామారావుగారు, జన్మదినం మార్చి 1890. జన్మస్థలం పాత గుంటూరు. తమపదవఏటినుండీ రచన సాగిస్తున్నారు. పోతన, తిక్కన మొల్ల, మొదలైన రచయితలు, వారి గ్రంథాలు అభిమానిస్తారు.

అంబరీష విజయం, నర్మదా నాటకం, రామ కథామంజరి, రాజరాజేశ్వరీ నక్షత్రమాల, తరుణీ శతకము, గోవిలాపము, సీతారాముల పాటలు, గాంధీ పాటలు, రామాయణ గానసుధ మొదలైన గ్రంథాలు ప్రచురించారు. ఇటీవల తిరువాయిమొళి అనువదించారు.

గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని అందుకున్నారు. 1965 సాహిత్య అకాడమీ ఉత్తమ రచయిత్రీ సన్మానాన్ని అందుకున్నారు. పలుసన్మానాలు పొందారు.


చిరునామా :

C/o. మాడపాటి నాగేశ్వరరావు,
రామారావు వీధి, గాంధీనగరం, విజయవాడ-3.



## కళ్యాణి ఎస్.

తండ్రి శ్రీ ఎస్. రామయ్య. జన్మదినం 18-8-'46. జన్మస్థలం బెంగుళూరు. ఆంగ్ల సాహిత్యంలో ఎం.ఏ. పట్టభద్రులు. పదమూడవఏటినుండీ చిన్న కథలతో రచన ప్రారంభించారు, మామ్, షా, ఓ హెన్రీ చెకోవ్, రాచకొండవారి రచనలు అభిమానిస్తారు.

సంఘర్షణ అనే నవల, పలు కథానికలు ప్రచురించారు.

నాటకాలు చదవడం, చూడడం సరదా.

చిరునామా :

C/o ఎన్. రామయ్య,
ఏజెంట్, ఇండియన్ బ్యాంకు లిమిటెడ్,
గుడివాడ.



## కామేశ్వరి దూర్వాసుల

భర్త శ్రీ డి. వి. నరసింహం. జన్మదినం 22-8-'35. జన్మస్థలం కాకినాడ. డిగ్రీలు లేవు. 1962 నుంచీ రచన సాగిస్తున్నారు. సోమర్‌సెట్ మామ్, ము. రంగనాయకమ్మ, రా. విశ్వనాథశాస్త్రి మొదలైన రచయితలను అభిమానిస్తారు.

చాలా కథానికలు వ్రాశారు.

పుస్తకపఠనం, రచయితల పరిచయం, సినిమాలు, పిక్నిక్కులు సరదాలు.

చిరునామా :

C/o. డాక్టర్ డి. కామేశ్వరరావు,

జయపురం,

కోరాపుట్ జిల్లా, ఒరిస్సా.



## ఉషారాణి భాటియా

భర్త శ్రీ సుమేంద్రసింగ్ భాటియా. జన్మదినం 21-10-'32. జన్మస్థలం మద్రాసు. బి.ఏ., బి.ల్. పట్టభద్రులు. తమ ఇరవయో సంవత్సరంనుంచీ రచన సాగిస్తున్నారు. అభిమాన రచనలు, రచయితలు చాలామంది ఉన్నారు.

తండ్రీ కూతురు, ప్రతీకారం, అరుణోదయం, చిట్టడవిలో చిన్నారి, ఎడ్గార్ ఎలెన్ పో కథానికలు, క్రిస్లర్ ఆత్మకథ మొదలైన గ్రంథాలు ప్రచురించారు. అనేక కథానికలు వ్రాశారు.

పుస్తకపఠనం, నృత్యం, సరదాలు. ప్రస్తుతం 'సోషల్ వెల్ ఫేర్' పత్రిక సంపాదక వర్గంలో పనిచేస్తున్నారు.

చిరునామా :

C/o. సుమేంద్రసింగ్ భాటియా,

హెచ్ 5/1, మాలవ్యనగర్,

న్యూఢిల్లీ-17.



## కనకదుర్గా రామచంద్రన్

భర్త శ్రీ ఎ. రామచంద్రన్. జన్మదినం 25-1-'19. జన్మస్థలం విజయవాడ. రుషీ వేలీ స్కూల్లో, మదనపల్లిలో, మద్రాసులో విద్యాభ్యాసం చేశారు. ఎం.ఏ., ఎం.ఇడి., పట్టభద్రులు. విశ్వనాథవారి రచనలు అభిమానిస్తారు.

వేటగాడి కొడుకు, అందమైన లోకం, ఇంద్రజాల దీపం, పిల్లల నాట్యకళ, ఐక్యరాజ్యసమితి, పిల్లలు కట్టిన చెలిమివంతెన మొదలైన బాల సాహిత్యం; విదర్ ఆర్ యు బౌండ్ ? అనే ఆంగ్ల గ్రంథం ప్రచురించారు.

1961 లో గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. సంగీతం, కావ్యగీతికలు సరదాలు.

చిరునామా :

C/o. ఎ. రామచంద్రన్,

38, భగీరథమ్మాళ్ వీధి,

టి. నగర్, మద్రాసు-17.



## నిర్మలప్రభావతి పవని

భర్త శ్రీ పవని శ్రీధరరావు. జన్మదినం 12-3-'39. జన్మస్థలం కనిగిరి (నెల్లూరుజిల్లా). స్కూలుఫైనలుదాకా చదివారు. 1954 నుండీ రచనలు ప్రచురితం అవుతున్నాయి. కందుకూరి, లింగరాజు, శరత్, ముప్పాళ రంగనాయకమ్మ మొదలైన రచయితలని అభిమానిస్తారు.

శలభాలు, ఉదయకిరణాలు- నవలలు; అనాథ, భగవాన్ నేనేమీ కోరను, స్త్రీ మొదలైన కథానికా సంకలనాలు ప్రచురించారు. ఊహాసుందరికి ఉత్తరాలు అనే వ్యాససంపుటినికూడా ప్రచురించారు.

తీరిక వేళల్లో పిల్లలకి కథలు చెప్పడం, కబుర్లు సరదాలు.

చిరునామా :

C/o పి. శ్రీధరరావు

మొగలిచెర్ల,

కందుకూరుతాలూకా,

నెల్లూరుజిల్లా.



# పద్మావతీదేవి కొమ్మూరి

భర్తగారు శ్రీ కొమ్మూరి వెంకట్రామయ్యగారు. జన్మదినం 7-7-1908. జన్మస్థలం రాజమండ్రి. మునిమాణిక్యం సూర్యనారాయణగారిదగ్గిర చదువుకున్నారు. 1933 నుంచీ రచనలు చేస్తున్నారు. కృష్ణశాస్త్రిగారు, శివశంకరస్వామి అభిమాన రచయితలు.

1939లో తొలుత ప్రమదావనం శీర్షిక ప్రారంభించారు. ప్రముఖ పత్రికలకి స్త్రీల పేజీలు వ్రాసేవారు. నూరుకు పైగా కథలు వ్రాశారు. 'పాగడ దండ' కథానికాసంకలనం అచ్చువేశారు.

పాగడదండకి ఢిల్లీసాహిత్య అకాడమీవారి బహుమానం లభించింది. గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. రచయిత్రి. ప్రఖ్యాత రంగస్థల నటీమణిగా పేరుగాంచారు.

సినిమాలుచూడడం, పుస్తకాలు చదవడం సరదాలు.

చిరునామా :

110 హబిబుల్లారోడ్డు,

మద్రాసు-17.



## పార్వతి అడవికొలను

భర్త శ్రీ అడవికొలను సాంబశివరావుగారు. జన్మదినం 22-3-'31. జన్మస్థలం కొవ్వూరు (పశ్చిమగోదావరిజిల్లా). థర్డ్ ఫారము వరకు చదివారు. 1955 నుంచీ రచనలు చేస్తున్నారు. టాల్‌స్టాయి, రవీంద్రుడు, శరత్, బాపిరాజు, శివశంకరస్వామి మొదలైన రచయితలను అభిమానిస్తారు.

పలుపత్రికలలో రెండువందలదాకా వ్యాసాలు వ్రాశారు. యుగసంధి అనే నవల వ్రాశారు. కథానికలు, ఛందస్సుకి సంబంధించిన నూటఇరవైఅయిదు పద్యాలు రచించారు.

ఉత్తమ గ్రంథపఠనం, సమాజసేవ, రచన సరదాలు.

చిరునామా :
14/13-1-1-A సూర్యారావుపేట,
మెయిన్‌రోడ్డు,
కాకినాడ.



## ప్రమీలాకుమారి ఆర్.

భర్తగారు శ్రీ ఆర్. బి. రావు. జన్మదినం 21-7-'44. జన్మస్థలం సోంపేట (శ్రీకాకుళంజిల్లా). బి. ఏ. చదువుతున్నారు. మల్లాది రామకృష్ణశాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి, ముప్పాళ రంగనాయకమ్మ మొదలైన రచయితలని అభిమానిస్తారు. తమ పదిహేడవఏటినుండీ రచన సాగిస్తున్నారు.

తెగినతీగెలు నవల, అనేక కథానికలు ప్రచురించారు. కరిగినస్వప్నం అనేనవల వ్రాశారు.

వీరి 'తెగినతీగెలు' నవల బహుమతి నందుకుంది. సాహిత్యం, చిత్రలేఖనం సరదాలు.

చిరునామా :
C/o. ఆర్. బి. రావు
25-8 బి — 218
సంజీవనగరు కాలనీ,
నంద్యాల, కర్నూలు జిల్లా.

## ఛాయాదేవి అబ్బూరి

భర్త శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావు. జన్మదినం 13-10-33. జన్మస్థలం రాజమండ్రి. ఎం.ఏ. పట్టభద్రులు. లైబ్రరీ సైన్సులో డిప్లమా గడించారు. కృష్ణశాస్త్రి, పద్మరాజు, యద్దనపూడి సులోచన మొదలైన రచయితలు, పలు ఆంగ్ల రచయితల అభిమానులు.

అపరిచిత లేఖ, 'అనగా అనగా' కథల సంపుటి ప్రచురించారు. 'కవిత' అనే ఆధునిక కవితా సంకలనాలు ప్రచురించారు.

కొంతకాలం 'వనిత' మాసపత్రికకు సంపాదకత్వం వహించారు.

గృహాలంకరణ, కథారచన సరదాలు, చైనీస్ భాష నేర్చుకుంటున్నారు.

చిరునామా :
15, పూసా రోడ్డు,
న్యూఢిల్లీ.



## జానకీరాణి తురగా

భర్త శ్రీ తురగా కృష్ణమోహన్. జన్మదినం 31-8-'36. జన్మస్థలం మచిలీపట్నం, కృష్ణాజిల్లా. ఎం. ఏ. పట్టభద్రురాలు. 1950 నుంచీ రచన సాగిస్తున్నారు. వెంకట పార్వతీశకవులు, బాపిరాజు, చలం, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, మామ్, మొపాసా ఓ హెన్రీ మొదలైన రచయితలను అభిమానిస్తారు.

నూటికిపైగా కథలు, ఎర్రగులాబీలు, జానకీరాణి కథలు, వ్యాసాలు ప్రచురించారు. 'కొడిగట్టని దీపాలు' నవల వ్రాశారు.

బాలల, మహిళల సంక్షేమ కార్యక్రమాలు నృత్య నాటికల నిర్వహణ, వంట సరదాలు, ప్రస్తుతం సెంట్రల్ సోషల్ వెల్ ఫేరు బోర్డులో వెల్ ఫేరు ఆఫీసరుగా ఉంటున్నారు.

చిరునామా :

3-4-663/13,

నారాయణగూడ,

హైదరాబాదు-29.



# తేజోవతి అధరాపురపు

భర్తగారు శ్రీ అధరాపురపు విఠల్ రావు. జన్మదినం 2-7-'36. జన్మస్థలం తెనాలి. బి.ఏ., బి.ఇడి. పట్టభద్రులు. ఎం.ఏ. చదువుతున్నారు. 1960 నుండీ రచనలు సాగిస్తున్నారు. వీరేశ లింగంగారి రచనలు, ప్రేమ్‌చంద్, థామస్ హాగ్స్ రచనలు అభిమానిస్తారు.

ఎన్.జి.ఓ. అనే కథానికల సంపుటి, 'పూర్వా సంధ్యాప్రవర్తతే' నవల ప్రచురించారు. పూర్వా సంధ్యాప్రవర్తతే నవల బహుమతి నందుకుంది.

గ్రంథపఠనం, సమకాలిక సమస్యల చర్చలు, వ్రాయడం, నాటకాలు చూడడం సరదాలు. హాస్యరచనలు ఎక్కువ ఇష్టం.

చిరునామా :

1వ లైను, 14, అడ్డరోడ్డు,
బ్రాడీపేట, గుంటూరు-2.



## దమయంతీదేవి రేబాల

భర్త శ్రీ రేబాల సుబ్బరామారెడ్డిగారు. జన్మదినం 5-11-'32. జన్మస్థలం నెల్లూరు. హైస్కూలు చదువుమాత్రమే సాగించారు. 1962 నుంచీ రచనలు సాగిస్తున్నారు. శరత్, టాగూరు, అడవి బాపిరాజు, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, బుచ్చిబాబు, లత మొదలైన రచయితలను అభిమానిస్తారు.

వనితాలోకపు సమస్యలు చర్చిస్తూ చాలా కాలంగా వ్యాసాలు వ్రాస్తున్నారు. కొన్నివందల వ్యాసాలు ప్రచురింపబడ్డాయి.

సంఘసేవాకార్యక్రమాలు, పిల్లల ఆటపాటలు సరదాలు. మంచివక్తగా, ప్రముఖ సంఘసేవికగా పేరుగడించిన జర్నలిస్టు.

చిరునామా :

పోస్టాఫీసురోడ్డు,

రామలింగాపురం,

నెల్లూరు.

## రంగనాయకమ్మ ముప్పాళ

భర్త శ్రీ ముప్పాళ సీతారామస్వామి. జన్మదినం 21-9-'39. జన్మస్థలం బొమ్మిడి గ్రామం (పశ్చిమ గోదావరి జిల్లా). స్కూలు ఫైనలు ప్యాసయ్యారు. పదిహేను సంవత్సరాల వయస్సులోనే రచనలు చేయడం ప్రారంభించారు. చదివినది తక్కువ కావడంతో ఇతరుల ప్రభావం తమపై తక్కువ అన్నారు. చలం, శరత్‌లను అభిమానిస్తారు.

బలిపీఠం, పేకమేడలు, కృష్ణవేణి, స్త్రీ, రచయిత్రి, చదువుకున్న కమల, కూలినగోడలు, ఆండాళ్ళమ్మగారు, పల్లెటూరు, స్వీట్ హోమ్ మొదలైన నవలలు ప్రచురించారు.

1965లో బలిపీఠానికి సాహిత్య అకాడమీవారి బహుమతి లభించింది. పుస్తకాలు చదవడం, పాటలువినడం సినిమాలు చూడడం సరదాలు.

చిరునామా :
ఎన్.ఏ.డి. పోస్టు,
విశాఖపట్నం-9.



## మీరాబాయి కె.

తండ్రిగారు శ్రీ కె. శంకరశాస్త్రిగారు. జన్మదినం 2-9-'45. జన్మస్థలం గుత్తి. బి.ఏ. చదివారు. 1962 నుంచీ రచన సాగిస్తున్నారు. యద్దనపూడి, ముప్పాళ, లత, శరత్ లను అభిమానిస్తారు.

మనిషి మమత అనేనవల, నన్ను క్షమించరూ మొదలయిన కథలు అనేకం ప్రచురించారు.

రచన, స్నేహాలు, మంచి పుస్తకాలు చదవడం సరదాలు.

చిరునామా :
C/o కె. శంకరశాస్త్రి
3/117 ఫస్ట్ రోడ్డు,
జార్జి పేట ఎక్స్ టెంషన్,
అనంతపురం.



## యశోదా దొరైస్వామి

భర్తగారు శ్రీ ఆర్. దొరైస్వామి. జన్మదినం 1-8-'38. జన్మస్థలం మద్రాసు. ఎమ్.ఎస్‌సి పట్టభద్రురాలు. చాలాకాలం నుంచి రాస్తున్నారు. మాలతి చందూర్, ముప్పాళ, నెవెల్ షూట్, డూమోరియర్, జయకాంతన్, కల్కి మొదలైన రచయితలను అభిమానిస్తారు.

తెల్లగులాబి మొదలైన కథలు, ప్రముఖ తమిళ రచయితలకు తెలుగు అనువాదాలు, వ్యాసాలు ప్రచురించారు.

బొమ్మలు చెయ్యడం, చిత్రలేఖనం, నవలలు చదవడం సరదాలు. ప్రస్తుతం లెక్చరరుగా పనిచేస్తున్నారు.

చిరునామా :
6/1 శ్రీపురం రెండవ వీధి.
మద్రాసు

# యశోదారెడ్డి పాకాల

భర్త ప్రఖ్యాత చిత్రకారులు పి. టి. రెడ్డి. జన్మదినం 8-8-'30. జన్మస్థలం బిజినాపల్లి (నాగర్ కర్నూలు తాలూకా, మహబూబ్ నగరు జిల్లా). తెలుగులో, సంస్కృతంలో ఎం. ఏ. డిగ్రీలు పుచ్చుకున్నారు. పన్నెండేళ్ళనుండి రచన సాగిస్తున్నారు. ప్రాచీన సాహిత్యం, ఉత్తమ రచయితలు, రచనలు అభిమానిస్తారు.

చిరుగజ్జెలు, భారతీయ చిత్రకళ, కావ్యానుశీలనము, అమృత జీవులు అనే గ్రంథాలు ప్రచురించారు.

తమకే తెలియని ఆసక్తి సరదాలు ఎన్నో ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులు.

చిరునామా :

కల్పనా ఇండస్ట్రీస్.
నారాయణ గూడ,
హైదరాబాదు.



## ప్రేమలీల బి.

భర్త గారు శ్రీ ఎమ్. శేషారావు గారు. జన్మదినం 9-9-'34. జన్మస్థలం తుని (తూర్పుగోదావరిజిల్లా), బి.ఎస్.సి., బి.ఇడి పట్టభద్రులు. హైస్కూలులో చదివేరోజులనుండీ రచనలు సాగిస్తున్నారు. తెలుగు నవలాసాహిత్యం, శరత్, అనుపమాదేవి, చలం అభిమాన రచయితలు.

ఈమె ప్రచురించిన అలజడి, అంత్యాబలి, శాపఫలం పలువురి ప్రశంసలు అందుకున్నాయి. చాలా కథలు, వ్యాసాలు ప్రచురించారు.

గ్రంథాలు సేకరించడం, గ్రంథపఠనం సరదాలు.

చిరునామా :

C/o. ఎమ్. శేషారావు,
రాజారావు రెడ్డి వీధి,
లక్ష్మీవారపు పేట,
రాజమండ్రి.



## బాలాదేవి భట్టిప్రోలు

తండ్రిగారు శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు. జన్మదినం 9-3-'44. జన్మస్థలం జయపురం (కోరాపుట్ జిల్లా). ఎమ్.ఎస్.సి చదువుకున్నారు. చిన్నతనంనుంచీ రచనావ్యాసంగం ఉంది. స్టీన్ బెక్, మేరీకొరెల్లీ, మామ్, కృష్ణశాస్త్రి, జంధ్యాల, లత మొదలైన రచయితలని అభిమానిస్తారు.

వెనుకకుతిరిగిన కాలచక్రం, ఇతరకథలు ప్రచురించారు. స్వర్గసీమలు, అనురాగమాలిక, రేణు మొదలైన రచనలు చేశారు.

వీరు రెండుసార్లు కథానికకు బహుమతి పొందారు. పుస్తకాలు చదవడం, ఊళ్లు చూడడం శిల్పం, చిత్రకళ, మంచి సినిమాలు సరదాలు.

చిరునామా :

C/o. వి. రామదాసు,
కరణం వీధి,
జయపురం,
కోరాపుట్ జిల్లా, ఒరిస్సా.



## బీనాదేవి

భర్తగారు శ్రీ భాగవతుల నరసింగరావు. అసలు పేరు భాగవతుల త్రిపుర సుందరమ్మ. జన్మదినం 11-2-'35. జన్మస్థలం చోడవరం (విశాఖ జిల్లా). బి.ఏ. పాసయ్యారు. 1965 నుంచీ రచనలు సాగిస్తున్నారు. రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారి రచనల ప్రభావం వారిపై ఉంది. కొడవటిగంటి, ముళ్ళపూడి, షా, డికిన్సులను అభిమానిస్తారు.

రాధమ్మ పెళ్ళి ఆగిపోయింది అనే కథానికా సంకలనం ప్రచురించారు. చాలా కథలు ప్రచురించారు.

కర్నాటక సంగీతం అంటే సరదా.

చిరునామా :
C/o. బి. నరసింగరావు
సబ్ జడ్జి,
నరసారావుపేట,
గుంటూరు జిలా.



## భానుమతి రామకృష్ణ
## పాలువాయి

భర్త శ్రీ రామకృష్ణరావుగారు. జన్మదినం 7-9-'25. జన్మస్థలం దొడ్డవరం (ఒంగోలుతాలూకా). ప్రీయూనివర్శిటీ పరీక్ష పాసయ్యారు. 1940 నుంచి రచన సాగిస్తున్నారు. శ్రీ మునిమాణిక్యం, విశ్వనాథ కవిరాజుల రచనలు అభిమానిస్తారు.

అత్తగారి కథలు రెండు సంపుటాలు, భానుమతి కథానికలు అనే సంకలనం ప్రచురించారు.

వీరి అత్తగారి కథలు సాహిత్య అకాడమీ బహుమతి నందుకుంది. ఆంధ్ర ప్రభుత్వ సన్మానం, భారత ప్రభుత్వ పద్మశ్రీ గౌరవం అందుకున్నారు. ప్రముఖ కళాకారిణి. చిత్రలేఖనం, సంగీతం, కుట్టుపని, వ్యవసాయం, రచన సరదాలు.

చిరునామా:
భరణీ గార్డెన్స్,
మద్రాసు-26.



## మణి ఎ. ఎస్. 'అరవింద'

భర్తగారు శ్రీ ఎ. రాధాకృష్ణరావు. జన్మదినం 14-1-'34. జన్మస్థలం ఏలూరు. బి.ఏ. పట్టభద్రులు. 53-54ల్లో రచన ప్రారంభించారు. అన్నిరకాల పుస్తకాలు చదివినా' రవీంద్రనాథ టాగూరు, టాల్‌స్టాయి రచనలు అభిమానిస్తారు.

పాతికకుపైగా కథలు వ్రాశారు. మేఘం వర్షించింది, చీకటి వెలుగులు పలువురి మన్ననలు అందుకున్నాయి.

వీరి మూడు కోణాలు కథానిక బహుమతి వందుకుంది.

సాహిత్యంలోను జీవితంలోను సత్యం, శివం, సుందరం కోరుతారు.

చిరునామా :
C/o. ఎ. ఆర్. కె. రావు
నెం. 4, టి. ఎస్ ప్లాట్సు,
బి. హెచ్. ఏరియా. కద్మా
జంషెడ్‌పూరు-5.



## మాలతి నిడదవోలు

తండ్రిగారు శ్రీ జగన్నాథరావు. జన్మదినం 26-6-'38. జన్మస్థలం విశాఖపట్నం. బి. ఏ. ఆనర్సు పట్టభద్రులు. లైబ్రరీ సైన్సులో మాస్టరు డిగ్రీ పొందారు. 1951 నుండీ రచనలు చేస్తున్నారు. థామస్ హార్డీ, మేరికొరిల్లి, దాశరథి, రాచకొండ విశ్వనాథశాస్త్రి, లాయిడ్ డగ్లస్, మధురాంతకం రాజారాం మొదలైన రచయితలని అభిమానిస్తారు.

దాదాపు డెబ్బయి కథలవరకు ప్రచురించారు. అనేక సంకలనాలలో వీరి కథలు పడ్డాయి.

చిన్నకథ వ్రాయడంలో అందెవేసినచేయి. పుస్తకపఠనం, స్నేహితులు సరదాలు. ప్రస్తుతం తిరుపతి విశ్వవిద్యాలయంలో లైబ్రేరియన్‌గా ఉంటున్నారు.

చిరునామా :

14-37-45 హ్యూమ్‌శాస్త్రి రోడ్డు.

విశాఖపట్నం-2.

# మాలతీ చందూర్

భర్త శ్రీ ఎన్. ఆర్. చందూరు. జన్మదినం 30_12_'29. జన్మస్థలం నూజివీడు. స్వయం కృషితో చదివిన చదువే. 1948 నుంచీ రచనలు ప్రచురిస్తున్నారు. మామ్, అప్టన్ సింక్లయిర్ మొదలైన పలురచయితలు అభిమానులు.

పాప మొదలైన సంకలనాలతో సహా పదహారు పుస్తకాలు ప్రచురించారు.

బహుళ జనాదరణ పొందిన ప్రమదావనం శీర్షిక నడుపుతున్నారు. తోటపని, పుస్తకపఠనం, స్నేహితులు సరదాలు.

చిరునామా :

7–ఎ. రోజరీ చర్చిరోడ్డు,

మైలాపూరు,

మద్రాసు_4.



## మీనాక్షీదేవి వేదుల

భర్త శ్రీ వేదుల శ్రీరామచంద్ర కీర్తిగారు. జన్మదినం 25-6-'17. జన్మస్థలం రాజమండ్రి. విశాఖపట్నం రాజమండ్రి లలో హైస్కూలు చదువు చదివారు. 1933 నుంచీ రచన సాగిస్తున్నారు. సంస్కృతాంధ్ర కవుల రచనలు, పెద్దనాది తెలుగు కవులు, వెల్సు, షా, క్రానిన్ మొదలైన ఆంగ్ల కవులు వీరికి అభిమానులు.

సభావేదిక, అష్టమహిషీకళ్యాణం, రాగ రేఖలు మొదలైన రచనలు ప్రచురించారు.

గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. గ్రంథ పఠనం, రచనా వ్యాసంగం సరదాలు. ఈమె చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులుగారి మనుమరాలు.

చిరునామా :
ఇంద్రగంటివారి ఇల్లు
లచ్చిరాజువారి వీధి,
సూర్యారావు పేట,
కాకినాడ.



## వెంకటరమణ గంటి

తండ్రిగారు క్రీ. శే. గంటి చంద్రశేఖర్ గారు. జన్మదినం 31-12-'43. జన్మస్థలం గంటి అనే గ్రామం. పెరిగి పెద్దదైనది సికింద్రాబాదులో. బి. ఏ. చదువుతున్నారు. 1960 నుండీ కథలు వ్రాయడం ప్రారంభించారు. కీ. శే. శారద, పోతుకూచి, శరత్, రవీంద్రుల అనువాదాలు వీరిని ప్రభావితం చేశాయి. విశాలాక్షి, ముప్పాళ మొదలైనవారి రచనలు అభిమానిస్తారు.

చదరంగం మొదలైన ఐదు నవలలు ప్రచురించారు. కథానికలు వ్రాశారు. ముళ్ళగులాబి, ఇంకొక నవల రచించారు.

గ్రంథాల సేకరణ, సంగీతం, పర్యటనలు సరదాలు.

చిరునామా :

హెచ్. నెం 2-1-223

రామాలయం దగ్గర, నల్లకుంట

ముషీరాబాద్ పోస్టు, హైదరాబాదు.



# శమంత రేవనూరి

భర్త శ్రీ రేవనూరి ఓబలరావు. జన్మదినం 6-10-'28. జన్మస్థలం పాణ్యం (కర్నూలు జిల్లా). 1962 నుండీ రచనలు సాగిస్తున్నారు. టాల్‌స్టాయి మొదలైన విదేశ రచయితలు, విశ్వనాథ సత్యనారాయణ, రాజమన్నారు, చలంవంటి తెలుగు రచయితలు, వారి రచనలు అభిమానిస్తారు.

గీతమాల గేయ సంపుటిని, హుసేన్ సాగరు కథల సంపుటిని ప్రచురించారు. ముక్తి వంటి వీరి కథలు చాలా ప్రచురితం అయ్యాయి. ఎన్నో రేడియో నాటికలు వ్రాశారు.

గాత్రంతో కర్నాటక సంగీతం, సితార్ హిందూస్థాని సంగీతం అభిమాన విషయాలు.

చిరునామా :
12 మూడవ మెయిన్ రోడ్డు,
గాంధీనగరు
మద్రాసు 20.



## శాంతాదేవి పోల్కంపల్లి
## (నూగూరి)

భర్త శ్రీ పోల్కంపల్లి సుదర్శనరావు. జననం '42. జన్మస్థలం వనపర్తి (మహబూబ్ నగరు జిల్లా). హెచ్. ఎస్. సి. పరీక్ష ఇచ్చారు. 1959 నుండీ రచనలు చేస్తున్నారు. శరత్ బాబు అభిమాన రచయిత.

పాణిగ్రహణం, బాటసారి, రక్తతిలకం, స్వీకృతి, జీవన సంగీతం, సుమలత, కాలపురుషుని హెచ్చరిక మొదలైన నవలలు ప్రచురించారు. విశ్వేశ్వరి, సమర్పణ, కట్టుబాటు మొదలైన అనేక కథానికలు ప్రచురించారు.

వీరి 'జీవన సంగీతం' నవల బహుమతి నందుకుంది. మంచి పుస్తకాలు చదవడం, సంగీతం వినడం సరదాలు.

చిరునామా :
C/o వి. సంజీవరావు, టీచరు
కృష్ణదేవనగరు,
వనపర్తి,
మహబూబ్ నగర్ జిల్లా.



## లక్ష్మీకాంతమ్మ గిడుగు

భర్తగారు శ్రీ గిడుగు వెంకటరామమూర్తిగారు. జన్మ దినం 14-2-1904. జన్మస్థలం రాజమండ్రి. ఇంటివద్దే, తెలుగు సంస్కృత, ఇంగ్లీషు భాషలు అభ్యసించారు. 1930 నుంచీ రచనలు సాగిస్తున్నారు. పోతన, భట్టుమూర్తి కాంచనపల్లి కనకాంబ, కనుపర్తి వరలక్ష్మమ్మ మొదలైన వారిని అభిమానిస్తారు.

లక్ష్మీశారదాగీతాలు, రమాపతీ శారదాపతీ శతకాలు, సుభాషితం, లేఖదూత, కుమారినీతి, ఆరోగ్యసామ్రాజ్యం, మానసిక సామ్రాజ్యం మొదలైన పలు గ్రంథాలు రచించారు.

గృహలక్ష్మి స్వర్ణ కంకణం అందుకున్నారు. సంగీతం, కవిత్వం, గ్రంథ రచన సరదాలు.

చిరునామా:
4/1, రామకృష్ణమఠం రోడ్డు
మైలాపూరు,
మద్రాసు 4.



## లక్ష్మీకాంతమ్మ గిడుగు

భర్తగారు శ్రీ గిడుగు వెంకటరామ్మూర్తిగారు. జన్మదినం 14-2-1904. జన్మస్థలం రాజమండ్రి. ఇంటివద్దే, తెలుగు సంస్కృత, ఇంగ్లీషు భాషలు అభ్యసించారు. 1930 నుంచీ రచనలు సాగిస్తున్నారు. పోతన, భట్టుమూర్తి కాంచనపల్లి కనకాంబ, కనుపర్తి వరలక్ష్మమ్మ మొదలైన వారిని అభిమానిస్తారు.

లక్ష్మీశారదాగీతాలు, రమాంపతీ శారదాపతీ శతకాలు, సుభాషితం, లేఖదూత, కుమారినీతి, ఆరోగ్యసామ్రాజ్యం, మానసిక సామ్రాజ్యం మొదలైన పలు గ్రంథాలు రచించారు.

గృహలక్ష్మి స్వర్ణ కంకణం అందుకున్నారు. సంగీతం, కవిత్వం, గ్రంథ రచన సరదాలు.

చిరునామా:
4/1, రామకృష్ణమఠం రోడ్డు
మెలాపూరు,
మద్రాసు 4.

## లక్ష్మీరఘురామ్ కొత్త



భర్తగారు శ్రీ కొత్త రఘురామయ్యగారు. జన్మదినం 18-6-'20. జన్మస్థలం గుంటూరు. బి. ఏ. పట్టభద్రులు. వైల్డు, షేక్స్పియరు, రసెల్, పానుగంటి, మరియు అభ్యుదయ రచయితలు-అందరినీ అభిమానిస్తారు.

సింగినాదం, కనువిప్పు, చిల్లిగవ్వ, ధన్యజీవులు మొదలైన నవలలు, ఆంధ్రనారి, మొగలిపొట్లం, హాస్యం, మనలో మనమాట, కన్నవీ, విన్నవీ వ్యాస సంపుటాలు ప్రచురించారు.

ప్రముఖ సేవాసంస్థలలో ప్రత్యక్ష పరిచయం ఉంది. సంఘసేవ, పర్యటనలు సరదాలు. పుస్తక పఠనం హాబీ.

చిరునామా :
14, అశోకా వీధి,
న్యూఢిల్లీ.



## లక్ష్మీరఘురామ్ కొత్త

భర్తగారు శ్రీ కొత్త రఘురామయ్యగారు. జన్మదినం 18-6-'20. జన్మస్థలం గుంటూరు. బి. ఏ. పట్టభద్రులు. వైల్డు, షేక్స్పియరు, రసెల్, పానుగంటి, మరియు అభ్యుదయ రచయితలు-అందరినీ అభిమానిస్తారు.

సింగినాదం, కనువిప్పు, చిల్లిగవ్వ, ధన్యజీవులు మొదలైన నవలలు, ఆంధ్రనారి, మొగలిపొట్లం, హాస్యం, మనలో మనమాట, కన్నవీ, విన్నవీ వ్యాస సంపుటాలు ప్రచురించారు.

ప్రముఖ సేవాసంస్థలలో ప్రత్యక్ష పరిచయం ఉంది. సంఘసేవ, పర్యటనలు సరదాలు. పుస్తక పఠనం హాబీ.


చిరునామా :

14, అశోకా వీధి,

న్యూఢిల్లీ.



## రమాదేవి వి.ఎస్.

భర్త శ్రీ వి. ఎస్. రామావతార్. జన్మదినం 24-2-'36. జన్మస్థలం కొవ్వూరు. ఎం.ఏ., ఎల్.ఎల్.బి. పట్టభద్రులు. తన పదిహేనవ సంవత్సరంనుంచీ రచనసాగిస్తున్నారు. మామ్, క్లోషి మెర్లీ, టెన్నిసీ విలియమ్స్, మొరావియా, రాచకొండ విశ్వనాథశాస్త్రి మొదలైన రచయితలను అభిమానిస్తారు.

కరిగిపోయినకలలు, దారితప్పిన మానవుడు, పంకజం, తల్లీబిడ్డలు, అందరూ మనుష్యులే మొదలైన నవలలు ప్రచురించారు. ఇంకా అనేక కథా సంకలనాలు, వ్యాస సంపుటాలు ప్రచురించారు.

రచయిత్రి, చక్కని కళాకారిణికూడా. మేధావులతో పరిచయాలు, నాటకాలు చూడడం, విదేశీయాత్రికులతో ఇష్టాగోష్ఠి సరదాలు.

చిరునామా :

C/o. డిపార్ట్‌మెంట్ ఆఫ్ లీగల్ స్టడీస్
(తెలుగు విభాగం), న్యూఢిల్లీ.



# వరలక్ష్మమ్మ కనుపర్తి

భర్త కీ. శే. శ్రీ కనుపర్తి హనుమంతరావుగారు. జన్మదినం 6-10-1896. నాలుగవతరగతి వరకు మాత్రమే స్కూలులో చదివారు. ఇంటివద్దనే భాషాభివృద్ధి చేసుకున్నారు. వీరేశలింగం పంతులు, చిలకమర్తివారి రచనలు, విజ్ఞాన చంద్రికా గ్రంథమాలవారి గ్రంథాలు, ఆంధ్ర భాషాభివృద్ధి సంఘంవారి గ్రంథాలు, వాటి ప్రభావం తమపై ఉందన్నారు.

వసుమతి, శారద లేఖలు, చెట్టునీడ ముచ్చట్లు, బాలసాహిత్యం, ద్విపదపాటలు, కథలు మొదలైనవి అనేకం ప్రచురించారు.

1934లో గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. 196[illegible]లో సాహిత్య అకాడమీవారి ఉత్తమరచయిత్రి గౌరవ బహుమానం అందుకున్నారు.

సంఘసేవ, మహిళాభ్యుదయ రచనలు, పిల్లలనాటికలు సరదాలు. వీరి తొలి రచన 1918లో అనసూయ అనే పత్రికలో ప్రచురింప బడింది.

చిరునామా :
కనుపర్తి వరలక్ష్మమ్మ,
బాపట్ల-గుంటూరుజిల్లా.



# వరలక్ష్మమ్మ కనుపర్తి

భర్త కీ. శే. శ్రీ కనుపర్తి హనుమంతరావు గారు. జన్మదినం 6-10-1896. నాలుగవతరగతి వరకు మాత్రమే స్కూలులో చదివారు. ఇంటివద్దనే భాషాభివృద్ధి చేసుకున్నారు. వీరేశలింగం పంతులు, చిలకమర్తివారి రచనలు, విజ్ఞాన చంద్రికా గ్రంథమాలవారి గ్రంథాలు, ఆంధ్ర భాషాభివృద్ధి సంఘంవారి గ్రంథాలు, వాటి ప్రభావం తమపై ఉందన్నారు.

వసుమతి, శారదలేఖలు, చెట్టునీడ ముచ్చట్లు, బాలసాహిత్యం, ద్విపదపాటలు, కథలు మొదలైనవి అనేకం ప్రచురించారు.

1934లో గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. 1963లో సాహిత్య అకాడమీవారి ఉత్తమరచయిత్రి గౌరవ బహుమానం అందుకున్నారు.

సంఘసేవ, మహిళాభ్యుదయ రచనలు, పిల్లలనాటికలు సరదాలు. వీరి తొలి రచన 1918లో అనసూయ అనే పత్రికలో ప్రచురింప బడింది.

చిరునామా :
కనుపర్తి వరలక్ష్మమ్మ,
బాపట్ల-గుంటూరుజిల్లా.



## రాజ్యలక్ష్మి పోలాప్రెగడ

భర్త శ్రీ పోలాప్రెగడ సత్యనారాయణమూర్తి. జన్మదినం 5-2-'33. జన్మస్థలం ఆలమూరు (పశ్చిమ గోదావరి జిల్లా). ఎనిమిదవ తరగతి వరకు చదివి, స్వశక్తితో సంస్కృతం, ఆంగ్లం అభ్యసించారు. 1964 నుంచీ రచనలు చేస్తున్నారు. మొపాసా, టాల్‌స్టాయి, విశ్వనాథ, శరత్ మొదలైన వారిని అభిమానిస్తారు.

'రాజ్యలక్ష్మి కథలు' సంపుటిగా వెలువరించారు. వాసంతి అనే గేయ సంపుటి, గగన కుసుమాలు అనే నవల రచించారు.

సంగీతం, సాహిత్యం సరదాలు.

చిరునామా :
డైతావారి వీధి,
రైలుపేట, బాపట్ల.



## వసుంధరాదేవి కె.

భర్త శ్రీ కుదరవల్లి అప్పారావుగారు. జన్మదినం 25-8-'36. జన్మస్థలం అంగలూరు (కృష్ణాజిల్లా) హైస్కూలు చదువుతో ముగించి, హిందీలో రాష్ట్ర భాషావిశారద ప్యాస య్యారు. చిన్నతనంనుండీ వ్రాస్తూనే ఉన్నా, '65 నుంచీ తిరిగి వ్రాయడం ప్రారంభించారు. తమపై హిందీ సాహిత్య ప్రభావం ఎక్కువగా ఉంది అంటారు. శరత్, ఠాగూరు, పండిత రామానందశర్మ మొదలైనవారి రచనలు అభిమానిస్తారు.

రాధిక నవల, కథానికలు, వ్యాసాలు చాలా ప్రచురించారు. నీలమణి, రాగోదయం, తొలగిన తెరలు మొదలైనవి రచించారు.

పుస్తకాలు చదవడం, పర్యటనలు, ఆయా ప్రాంతాల వారి జీవన పద్ధతులు గమనించడం సరదాలు.

చిరునామా :
c/o. డి. సి. ఎమ్. రిటైల్ స్టోరు,
బ్రాడీపేట,
గుంటూరు.



## వసుంధరాదేవి కె.

భర్త శ్రీ కుదరవల్లి అప్పారావుగారు. జన్మదినం 25-8-'36. జన్మస్థలం అంగలూరు (కృష్ణాజిల్లా) హైస్కూలు చదువుతో ముగించి, హిందీలో రాష్ట్ర భాషావిశారద ప్యాస య్యారు. చిన్నతనంనుండీ వ్రాస్తూనే ఉన్నా, '65 నుంచీ తిరిగి వ్రాయడం ప్రారంభించారు. తమపై హిందీ సాహిత్య ప్రభావం ఎక్కువగా ఉంది అంటారు. శరత్, ఠాగూరు, పండిత రామానందశర్మ మొదలైనవారి రచనలు అభిమానిస్తారు.

రాధిక నవల, కథానికలు, వ్యాసాలు చాలా ప్రచురించారు. నీలమణి, రాగోదయం, తొలగిన తెరలు మొదలైనవి రచించారు.

పుస్తకాలు చదవడం, పర్యటనలు, ఆయా ప్రాంతాల వారి జీవన పద్ధతులు గమనించడం సరదాలు.

చిరునామా :
c/o. డి. సి. ఎమ్. రిటైల్ స్టోరు,
బ్రాడీపేట,
గుంటూరు.



## రామలక్ష్మి కె.

భర్త శ్రీ ఆరుద్ర. జన్మదినం 31-12-'30. జన్మస్థలం కోటనందూరు. మద్రాసు విశ్వవిద్యాలయపు బి.ఏ. పట్టభద్రులు. 1951 నుండీ రచన సాగిస్తున్నారు. ఆంగ్లాంధ్ర రచయితలు, ప్రాచీనకవులు చదువుతారు. అభిమానిస్తారు.

అవతలిగట్టు, మెరుపుతీగ, తొణికిన స్వర్గం, మానని గాయం, ఆణిముత్యం మొదలైన నవలలు, నీదే నా హృదయం మొదలైన కథాసంకలనాలు, అనేక అనువాదాలు ప్రచురించారు.

గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. ఇంటిపని, పిల్లలతో కాలక్షేపం, స్నేహితులతో కబుర్లు సరదాలు.

చిరునామా :

1, శివప్రకాశ మొదలివీధి, టి. నగర్
మద్రాసు-17.



## రామలక్ష్మి పాకల

తండ్రి శ్రీ పి. కేశవరావుగారు. జన్మదినం సెప్టెంబరు 42. జన్మస్థలం ఛత్రపూరు. కళాశాలలో చదువుతూ మానేశారు. 1962 నుంచీ రచనలు సాగిస్తున్నారు. లత, కొడవటిగంటి, రాజారాం, అవసరాల, టి. జానకీరాణి మొదలైన రచయితలను అభిమానిస్తారు.

అనేక కథలు, అర్పణ నవల ప్రచురించారు.

ఇతర విశేషాలాట్టే లేవు అన్నారు.

చిరునామా :

C/o. పి. కేశవరావు

తిక్కపల్లి వీధి,

ఛత్రపూరు, గంజాం జిల్లా.



## విజయలక్ష్మి ఉన్నవ

భర్తగారు శ్రీ డబ్ల్యు. వి. ఎస్. రామలింగంగారు. జన్మదినం 24-8-'28. జన్మస్థలం రాజమండ్రి. ప్రైవేటుగా బి. ఏ. చదివారు. 1955 నుండీ రచనలు సాగిస్తున్నారు.

నిరీక్షణ, జీవనరాగం, అర్ధాంగి, అంతస్తులు అభిమానాలు మొదలైన నవలలు ప్రచురించారు.

అప్పుడప్పుడు రేడియో ప్రసంగాలు ఇస్తూ ఉంటారు.

చిరునామా :
53/4, ఎల్. ఐ. జి. హెచ్.
బర్కత్‌పూరా,
హైదరాబాదు.



విజయలక్ష్మి జి.

భర్త శ్రీ ఎ. మురళీకృష్ణ. జన్మదినం 1-10-'45. జన్మస్థలం ఉంగుటూరు. కృష్ణాజిల్లా. ఎం. బి. బి. ఎస్. పట్టభద్రులు. 1962 నుంచీ రచనలు చేస్తున్నారు. రాచకొండ, ముళ్లపూడి మొదలైన రచయితలని, కాలాతీతవ్యక్తులు, అల్పజీవి మహాప్రస్థానం వంటి రచనలని అభిమానిస్తారు.

**మలుపు, మోహనవంశి** మొదలైన కథానికలు అనేకం ప్రచురించారు.

వీరి మలుపు కథానిక బహుమతి నందుకుంది. చిత్రలేఖనం, సంగీతం, గేమ్సు, ఎంబ్రాయిడరీ, ఏక్టింగు సరదాలు.

చిరునామా :
హౌస్ సర్జన్,
ఉస్మానియా ఆస్పత్రి,
హైదరాబాదు.



# రూపాబాయి మోతీలాల్

భర్త కీ. శే. శ్రీ మోతీలాల్. జన్మదినం 6-8-'27. జన్మ స్థలం నెల్లూరు. ఎనిమిదవ తరగతి వరకు చదివి, దక్షిణభారత హిందీ ప్రచార సభవారి విశారద పూర్తి చేశారు. మాతృభాష హిందీ. దాదాపు ఇరవై సంవత్సరాలకి ముందు రచన ప్రారంభించారు.

వీరపాండ్య కట్టబొమ్మ నాయకుడు అనే చారిత్రాత్మక నవల ప్రచురించారు. అనేక చారిత్రక నాటకాలు రచించారు.

చారిత్రక విషయాలు ఆధారంగా నాటికలు, నవలలు వ్రాయడం సరదా.

చిరునామా :

50/1, ఎంపరరు వీధి,

తూత్తుకుడి-1.



## విజయలక్ష్మి రామకృష్ణన్

భర్త శ్రీ వి. రామకృష్ణన్. జన్మదినం 17-8-'34. జన్మస్థలం బిలాస్‌పూరు (మధ్యప్రదేశ్). ఎమ్.ఎస్‌సి. పట్టభద్రులు. 1955లో రచన ప్రారంభించారు. ఎందరివో, ఎన్నో రచనల ప్రభావం తమపై ఉందన్నారు.

వివిధ పత్రికలలో కథానికలు, స్కెచ్‌లు ప్రచురించారు. కిశోరప్రాయం నవల రచించారు. శాస్త్రగ్రంథాలు రచించారు.

దక్షిణభారత చరిత్ర, సమకాలిక సాహిత్యం, జీవిత చరిత్రలు, ఊళ్లు తిరగడం, కొత్త వంటలు ప్రయత్నించడం సరదాలు.

చిరునామా :

**5, మారియమ్మన్ కోవెల వీధి,**

**పీలమేడు, కోయంబత్తూరు-4.**



## లలిత మందరపు (పి.)

భర్త శ్రీ పి. ఎస్. గోవిందస్వామి. జన్మదినం 30-6-'33. జన్మస్థలం విజయవాడ. బి.ఏ. ఆనర్సు పట్టభద్రులు. పన్నెండు, పదమూడవ ఏట రచన ప్రారంభించారు. శరత్, ఉడ్ హౌస్ నవలలు పర్ల్ బక్ రచనలు, షా మొదలైన రచయితలని, రచనలని అభిమానిసారు.

అయిదు రెట్లు అనే నవల రవిచంద్ర, నవలలు పత్రికకి పైచిలుకుగా కథలు, వ్యాసాలు రచించారు.

పుస్తక పఠనం, సంగీతం అభిమాన విషయాలు. ఆంధ్ర దినపత్రికలో సహాయ సంపాదకురాలుగా ఉంటున్నారు.

చిరునామా :
C/o. ఆంధ్ర పత్రిక (దిన)
6, తంబుచెట్టి స్ట్రీట్,
మద్రాసు-1.



## లలిత వడ్లమాని

భర్త శ్రీ వి. ఎస్. ఆర్. రావు. జన్మదినం 12-6-'36. జన్మస్థలం కాకినాడ. మెట్రిక్ వరకు చదివారు. 1962 నుంచి రచన సాగిస్తున్నారు. శరత్, ఠాగూరు, చలం, రాచకొండ, కుటుంబరావు రచనలు అభిమానిస్తారు.

పలు కథానికలు ప్రచురించారు. వీరి 'నిస్పృహ' కథానికకు బహుమతి లభించింది.

ప్రకృతి తిలకించడం, వేదాంతం, పిల్లలు, సంసారం సరదాలు.

చిరునామా :
బి/33 సెక్టరు 19
రూర్కెలా 2.
ఒరిస్సా.

# వివేకానందదేవి అద్దేపల్లి

భర్త శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారు. జన్మదినం 27-9-'22. జన్మస్థలం పూళ్ల. పశ్చిమ గోదావరిజిల్లా. బి. ఏ. పట్టభద్రురాలు. 1956 నుండీ రచనలు సాగిస్తున్నారు. టాల్‌స్టాయి, హార్డీ, పెరల్‌బక్, క్రోనిన్ మొదలైన రచయితల రచనలని అభిమానిస్తారు.

వెలుగు నీడలు, అగ్నిగుండాలు, భిన్న స్వరాలు నవలలు, భారత జనాభా-కుటుంబనియంత్రణ, కళ్యాణి కథలు, క్షేత్రయ్య నాటకం, వసంతాగమనం నాటకం, ఉత్తమ అమెరికను మహిళలు, వంటింటి సౌభాగ్యం, మన శరీర నిర్మాణం మొదలైన అనేక రచనలు ప్రచురించారు.

సంఘసేవ, రచన, తోటపని సరదాలు. '59 లో అమెరికా, యూరపు యాత్రలు చేశారు. ప్రముఖ సంఘసేవిక.

చిరునామా :

దానవాయిపేట,

రాజమండ్రి.



## లక్ష్మీకాంతమ్మ
## ఊటుకూరి

భర్తగారు శ్రీ ఊటుకూరు హయగ్రీవగుప్త. జన్మదినం డిసెంబరు '17. జన్మస్థలం ఏలూరు. వైశ్యసేవాసదనంలో, ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలలో చదువుకున్నారు. తెలుగు, సంస్కృతం, హిందీ, ఆంగ్ల భాషలు నేర్చారు. ఉభయ భాషాప్రవీణ పట్టం పుచ్చుకున్నారు.

ఆంధ్ర కవయిత్రులు, యుగ పురుషుడు, సదుక్తి మంజరి, శ్రీ కన్యకా సుప్రభాతం, దేవీతారావళి, అఖిల భారత కవయిత్రులు మొదలైన పలు గ్రంథాలు, ప్రముఖ కావ్యాలకు పీఠికలు రచించారు.

ఆంధ్ర కవయిత్రులు 1953 లో భాషా సమితి బహుమతి నందుకొంది. అనేక ఉద్యమాలలో ప్రముఖ పాత్ర వహించారు. దీక్షగల కార్యకర్తగా పేరుగాంచారు. ఆంధ్ర రచయిత్రుల సలహాసంఘ అధ్యక్షులు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులు. హైదరాబాదులో '65లో అఖిలభారత రచయిత్రీ సమ్మేళనం జరిపారు. గృహలక్ష్మీస్వర్ణకంకణం అందుకున్నారు. వీణ, ఉపన్యాసాలు, వ్రాయడం మొదలైనవి సరదాలు. విద్వత్కవయిత్రి, ఆంధ్ర సరస్వతి మొదలైన బిరుదాంకితులు.

చిరునామా :

బాపట్ల
గుంటూరుజిల్లా.



## విశాలాక్షి ద్వివేదుల

భర్త డాక్టర్ డి. ఎస్. రావు. జన్మదినం 15-8-'29. జన్మస్థలం విజయనగరం. ఆంధ్ర మెట్రిక్ లో ఉత్తీర్ణు లయ్యారు. 1956 నుండీ రచనలు చేస్తున్నారు.

వైకుంఠపాళీ, మారిన విలువలు, గ్రహణం విడిచింది, వారధి, ఆమె కోరిక, గోమతి మొదలైనవి ప్రచురించారు.

'65లో వైకుంఠపాళీ నవల బహుమతి నందుకుంది. పుస్తక పఠనం, మిత్రులతో యిష్టాగోష్ఠి, సినిమాలు సరదాలు.

చిరునామా :
22, విజయరాఘవాచారి రోడ్డు,
మద్రాసు 17.



## శార్వాణి

భర్త శ్రీ ఎన్ రామయ్య. అసలు పేరు నీలారంభం శారదమ్మ. జన్మదినం 8-12-'28. జన్మస్థలం కోలారు (మైసూరు రాష్ట్రం). పదహారవ ఏటినుండి రచనలు సాగిస్తున్నారు. త్రివేణి, శరత్, ఠాగూరు, రాచకొండ విశ్వనాథశాస్త్రి మాలతీ చందూరు మొదలైనవారి రచనలు అభిమానిస్తారు.

వెండిమబ్బు, తామరకొలను, అపస్వరం, అపజయం, కీలుబొమ్మలు మొదలైన నవలలు, అనేక కథానికలు ప్రచురించారు.

చదవడం, సినిమాలు చూడడం, కన్నడ భాషలోని ఉత్తమ భావసంపదని తెలుగువారికి చవిచూపించాలని తలపోయడం సరదాలు.

చిరునామా :
C/o ఎన్. రామయ్య.
ఏజెంటు. ఇండియన్ బ్యాంకు లిమిటెడ్.
గుడివాడ.



## సుమన్ ఎస్.ఎస్.యం.

తండ్రి శ్రీ ఎస్. మార్టిన్‌లూథర్. జన్మదినం 26-6-'43. జన్మస్థలం కాకినాడ. ఎం. ఏ. పట్టభద్రురాలు. 1962 నుంచీ రచనలు చేస్తున్నారు. ముప్పాళ, శరత్, విశ్వనాథ, పోతుకూచి, దాశరథి, ఆరుద్ర మొదలైనవారి రచనలు అభిమానిస్తారు.

జీవితం, విరిసిన విరజాజులు, వాడిన పూలు, నాకు తాగాలని ఉంది మొదలైన అనేక కథలు ప్రచురించారు.

తెలుగు, ఇంగ్లీషు నవలాపఠనం చారిత్రక స్థలాలు చూడడం సరదాలు.

చిరునామా :
C/o. లక్ష్మీబాయినివాస్,
హెచ్. నెం. 2-184 సీతాఫల్‌మండి,
సికింద్రాబాదు.



## శ్యామలారాణి

తండ్రి కీ. శే. బ్రహ్మశ్రీ ఆకెళ్ళ సూర్యనారాయణ శాస్త్రిగారు. అసలుపేరు ఆకెళ్ళ కమలా విజయలక్ష్మి. జన్మ దినం: 27-4-'46. జన్మస్థలం బొబ్బిలి. బి. ఏ. పరీక్షకు చదువు తున్నారు. 1965 నుంచి రచన సాగిస్తున్నారు. బ్రౌనింగు, వర్డ్స్‌వర్త్, మునిమాణిక్యం, రంగనాయకమ్మ, డికెన్సు, జేన్ ఆస్టిన్ మొదలైన రచయితలని రచనలని అభిమానిస్తారు.

తుదికోరిక, పడగనీడ మొదలైన కథలు, జీవనవాహిని నవల ప్రచురితం అయ్యాయి.

ప్రశాంత ప్రదేశాలలో కాలం గడపడం సరదా.

చిరునామా :

న్యూ ఎఫ్/4 నిజాం కాలనీ

బనారెస్ హిందూ విశ్వ విద్యాలయం.

వారణాశి. 5.

ఉత్తరప్రదేశ్.



## సరళాదేవి పి.

భర్త శ్రీ పి. కుమారస్వామి. జన్మదినం 3-8-'37. జన్మస్థలం విజయనగరం. ప్రైవేటుగా ఇంటరువరకు చదివారు. 1956 నుండి రచనలు సాగిస్తున్నారు.

కుంకుమరేఖలు నవల, అనేక కథానికలు ప్రచురించారు. రేడియోలో సీరియల్ కథలు ప్రసారం చేశారు.

ఉత్తమ సాహిత్యం చదవడం, అప్పుడప్పుడు రాస్తూండడం సరదా.

చిరునామా :
1-7-50 మైదానం.
సామర్లకోట.



## సుమలత

భర్త శ్రీ మండా సత్యనారాయణ. అసలు పేరు శ్రీమతి సతీశుక వాణి. జన్మదినం 25_11_'43. జన్మస్థలం ఉయ్యూరు. భాషాప్రవీణ పరీక్ష ప్యాసయ్యారు. 1960 నుండీ రచన సాగిస్తున్నారు. అవసరాల, అడవి బాపిరాజు, ముప్పాళ రంగనాయకమ్మ మొదలైనవారిని అభిమానిస్తారు.

జీవనకలశం నవల, అనేక కథానికలు ప్రచురించారు.

జీవనకలశం నవల బహుమతి నందుకుంది. పుస్తకాలు చదవడం, వ్రాయడం, సరదాగా ఉండడం సరదాలు.

చిరునామా :

C/o. మండా సత్యనారాయణ,
మెషినిస్టు ఇన్‌స్ట్రక్టరు. ఐ. టి. ఐ.,
అశోక్ నగరు,
విజయవాడ_8.

# సులోచనారాణి యద్దనపూడి

భర్త శ్రీ యద్దనపూడి లక్ష్మీనరసింహారావు. జన్మదినం 2-4-'40. జన్మస్థలం కాజ (కృష్ణాజిల్లా). స్కూలుఫైనలు చదివారు. 1957 నుండీ రచన సాగిస్తున్నారు. ఆస్కార్ వైల్డు, శరత్ మొదలైన రచయితలని అభిమానిస్తారు.

సెక్రటరీ, విజేత, బహుమతి, జ్యోతి, నేను రచయిత్రిని కాను మొదలైన రచనలు ప్రచురించారు.

వీరి కథానిక 'తెలిసిన విలువలు' బహుమతి నందుకుంది.

పుస్తకపఠనం, మానవ మనస్తత్వపరిశీలన, వూళ్లుతిరగడం ముఖ్యమైన సరదాలు.

చిరునామా :

శైలజానివాస్,

6-3-662/7 జఫరాలీబాగ్,

హైదరాబాదు-4.



## సరస్వతీదేవి ఇల్లిందల

భర్త శ్రీ ఇల్లిందల సీతారామారావు. జన్మదినం 27-6-'18. జన్మస్థలం నరసాపురం. మెట్రిక్ వరకు చదివారు. జర్నలిజంలో సర్టిఫికేటు పుచ్చుకున్నారు. 1934 నుంచి రచనలు సాగిస్తున్నారు.

నారీజగత్తు, జీవన సామరస్యం, వెలుగు బాటలు, వ్యాససంపుటాలు, పండుగ బహుమానం, అక్కరకు వచ్చిన చుట్టం, ముత్యాల మనస్సు కథానిక సంపుటాలు, రాగంలో రంగులు నాటికా సంపుటి, గాంధీకథ, జాతిరత్నాలు, మొత్తం పదికిపైగా పుస్తకాలు ప్రచురించారు.

పిల్లల నాటికలు, పాటలకు బహుమతి అందుకున్నారు. పుస్తకపఠనం, తోటపని సరదా.

చిరునామా :

న్యూ నల్లకుంట
హైదరాబాదు-13.



# సీతాదేవి గొల్లపూడి

భర్త శ్రీ గొల్లపూడి శివరామకృష్ణయ్య. జన్మదినం 27-4-'45. జన్మస్థలం నిడుబ్రోలు (గుంటూరు జిల్లా). ఇంగ్లీషు తెలుగు చదువనూ వ్రాయనూ వచ్చును. కాలేజీచదువు లేదు. పది హేనవ ఏటినుండి రచన సాగిస్తున్నారు. లత, ముళ్ళపూడి, విశాలాక్షి, చలం, శరత్ మొదలైన రచయితలని అభిమానిస్తారు.

విధివైపరీత్యం, నీలి తెరలు, అవ్యక్తం మొదలైన అనేక కథలు ప్రచురించారు.

వ్రాయడం, చదవడం, సమస్యాపూరణం, బొమ్మలు వేయడం సరదా.

చిరునామా:

**D/o జి. శివరామ కృష్ణయ్య**
సెక్షన్ హెడ్, ఎల్. ఐ. సి. బ్రాంచి,
మహబూబ్ నగరు.



## హేమలత ('జ్వాల') అయ్యగారి

భర్తగారు శ్రీ ఎ. వి. ఆర్. జి. కృష్ణమూర్తి. జన్మదినం 19-8-'43. బి. ఎస్. సి చదువుతూ మానేశారు. 1961 నుండీ రచన సాగిస్తున్నారు. అరవింద, ముప్పాళ, అవసరాల, చలం, లతల సాహిత్యాలు అభిమానిస్తారు.

కాగితంపువ్వు, అతిథిరాలేదు, పిచ్చికగూడు మొదలైన రచనలు ప్రచురించారు. అపశ్రుతులు, మంచివాళ్ళకథ మొదలైనవి వ్రాశారు.

పుస్తకపఠనం, గ్రంథసేకరణ, పర్యటన సరదాలు.


చిరునామా :

C/o. ఎ. వి. ఆర్. జి. కృష్ణమూర్తి, ఐ. ఎఫ్. ఎస్.,
కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్టు,
హైదరాబాదు-22.

# సీతాదేవి వాసిరెడ్డి

తండ్రిగారు వాసిరెడ్డి రాఘవయ్యగారు. జన్మదినం 15-12-'33. జన్మస్థలం చేబ్రోలు (గుంటూరుజిల్లా). ఎం. ఏ. పట్టభద్రులు. అలాహాబాదు విశ్వవిద్యాలయపు సాహిత్యరత్న డిగ్రీ పొందారు. 1951 నుండీ రచన ప్రారంభించారు. కుటుంబరావు, రాచకొండ, చలం, మాలతీచందూర్, బీనాదేవి మొదలైనవారి రచనలని అభిమానిస్తారు.

వాసిరెడ్డి సీతాదేవి కథలు, ప్రేమచంద్ జీవితం, ఆమెలోకం, నాకథ వ్రాయవూఅ?, డవిమల్లె, తిరస్కృతి మొదలైన రచనలు ప్రచురించారు.

నాటకాలు చూడడం, డైరెక్టు చెయ్యడం, పుస్తకాలు చదవడం సరదాలు. ప్రస్తుతం స్త్రీ సంక్షేమశాఖలో ఉద్యోగం చేస్తున్నారు.

చిరునామా :

74/2 ఆర్. టి. ప్రకాశం నగరు,

హైదరాబాదు-16.

# సుబ్బమ్మ రావూరి

భర్త శ్రీ రావూరి రామకృష్ణయ్య. 1908లో వివాహం. 1918లో ప్లేగు వ్యాపించినప్పుడు డాక్టరుగా చికిత్సలు చేస్తూ కాలధర్మం చేశారు. జన్మదినం 9-2-1896. జన్మస్థలం వీరవాసరం. వీరేశలింగం పంతులుగారి బాలికాపాఠశాలలో భర్త మరణానంతరం పై చదువులు సాగించారు. 1925లో ఉభయ భాషాప్రవీణ పరీక్ష పాసయ్యారు. ఆ పరీక్ష ప్యాసయిన తొలి మహిళ యీమె.

రాజశేఖరుని కర్పూరమంజరికి అనువాదం, ఉదారపాండవం, హర్ష చరిత్ర, మృచ్ఛకటిక, అనేక ప్రాస్తావిక పద్యాలు ప్రచురించారు.

చిన్నతనంలోనే వితంతువు కావడంతో, పెద్దలదగ్గర పంచకావ్యాలు చదువుకుని సంస్కృత ఆంధ్రాలలో మంచి ప్రావీణ్యం సంపాదించారు. ఈమె చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి మేనకోడలు. బత్తుల కామాక్షమ్మగారు యీమెకు బాల్య సఖి. ప్రియమిత్రులు. ఆంధ్రోపాధ్యాయురాలుగా పనిచేశారు.

చిరునామా :

దానవాయిపేట,

రాజమండ్రి.



## సుబ్బాయమ్మ గాడిచెర్ల

భర్త శ్రీ గాడిచెర్ల సత్యనారాయణగారు. జన్మదినం 15-4-1903. జన్మస్థలం రాజమండ్రి. ఎనిమిదవతరగతివరకు చదివి, హిందీభాషను అధ్యయనం చేశారు. 1946 నుండీ రచనలు చేస్తున్నారు.

ఆంధ్రమహిళ, గృహలక్ష్మి మొదలైన పత్రికలలో అనేక రచనలు ప్రచురించారు. రేడియో ప్రసంగాలు చేశారు. భక్తమార్కండేయ గ్రంథాన్ని ప్రచురించారు.

సంగీతం, ఇష్టాగోష్ఠి, రచన సరదాలు. గృహవైద్యం కూడా బాగా తెలుసు.

చిరునామా :
63 వీరపెరుమాళ్ కోవెల వీధి,
మద్రాసు-4.



## సుభద్రాదేవి వేల్పూరి
## (భట్టిప్రోలు)

భర్త శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి. జన్మదినం 10-7-'27. జన్మస్థలం విజయనగరం. స్వయంకృషితో చదువుకున్నారు. 1955 నుండీ రచన సాగిస్తున్నారు. ముప్పాళ, శరత్, స్టీన్ బెక్, చలం, మొపాసా, ఓ హెన్రీ మొదలయిన రచయితలని, రచనలని అభిమానిస్తారు.

మంచుబొమ్మలు నవల ప్రచురించారు. కథానికలు, విరగని కొమ్మలు, గాజుబొమ్మలు నీలా రాగిణి మొదలైన రచనలు చేశారు.

వీరి మంచుబొమ్మలు నవల బహుమతి పొందింది. చదవడం, మహిళాసంక్షేమకార్యక్రమాలు, పర్యటనం సరదాలు.


చిరునామా :
C/o. భట్టిప్రోలు కృష్ణమూర్తి,
కెవుంఝర్ గడ్,
కెవుంఝర్ జిల్లా,
ఒరిస్సా.



హేమలత తెన్నేటి
('లత')

భర్తగారు శ్రీ తెన్నేటి అచ్యుతరామయ్యగారు. జన్మస్థలం విజయవాడ. తమ ఎనిమిదవ ఏటినుండి రచన సాగిస్తున్నామన్నారు. శరత్, మామ్, చలం, వైల్, షా, శ్రీ శ్రీ, గాలిబ్, ఖయాం మొదలైనవారిని అభిమానిస్తారు.

మోహనవంశి, వారిజ, పిచ్చివాళ్ళ స్వర్గం, తిరగబడ్డ దేవతలు, పథవిహీన మొదలైన నవలలే కాక, ఊహాగానం మొదలైన సంపుటాలు మొత్తం నలభై అయిదు దాకా ప్రచురించారు.

గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. దేశీయుల అభిమానం పొందారు.

చిరునామా :
హనుమాన్ పేట
విజయవాడ-3.

